తే_గీ. కలికి నెమ్మోము దరహాసగరిమ వెడద
కన్నుఁగవ వాగ్విలాసంబు గళము సొంపు
విమలరూపము దానవిభ్రమము వరుస
మిగులఁ జెప్పంగ నొప్పనీ మెలఁతయందు. 148

క. దరమాసళ వై ఖరిసుం, దరమా సతిరూప మెన్నఁ దరమా ఘనమం
దరమా కుచయుగళముకం, దరమా యుతనాభి తగును దరమా చెలికిన్.

వ. ఇట్లొప్పు నక్కన్యకాలలామంబు సంప్రాప్త యౌవనయగుటయు.

సీ. ప్రాతరారంభ సంభ్రమవిశేషంబు నరుచులసీ నెడు సరోరుహాననసంగి
పౌరుషప్రాత్పాటి నారూఢఁ జెందంగ సానవెట్టిన మారు శరమునంగి
మధుమాసవాసరమును హిమము చేఁదరుణపుష్పితమైన మల్లికాలతయనంగి
ఘనతరాభోగభోగి నిధానపరివర్ధమానంబయిన పెన్నిధానమనగ.

తే_గీ. మోము మోహంపుచులచే గోము మిగిలె
చూపు పెళ్ళుకలఁ దగెఁ గుబ్బ లేపుఁ జెంప
తనువు జానూనెభరమైన తంబ మొప్పె
పండుయౌవన మింతికి నిండుకొనెను. 151

రుక్మిణి శ్రీకృష్ణుని మోహించుట.

సీ. తనదు దివ్యజ్ఞానమున ద్వారకాపురిపై త్యాగదివ్యాస్య తారమగుచు
బహుగు శ్రీకృష్ణుండు భర్త కాఁదగునని యోచించి యాతండు నుత్సవమున
దను నాత్మపత్నిగాఁ గొనఁ గృప సేయంగ నిశ్చలమతిబూని నిష్టమెయిని
తంత్రిసృజించిన దాక్షాయిణీదేవి గృహమున తప మొనరింపుచుండి.

ఆ_వె. తనమనంబు దల్పఁ దద్దయు శ్రీకృష్ణు
కడకు నాశ్రితులకుఁ గృప జెమిసురుల
సనుపుటయును వారలతిభక్తియుక్తులై
ద్వారకాపురంబుఁ జేరియచట. 152

తే_గీ. ద్వారకసమాశ్రితేష్టాభిపూరకుండు
భావిశుభ కార్యఘుష్యండు శ్రీవిభుండు

నిచట జరిగిన చందంబు లెల్లఁ దెలిసి
చిత్తమున మొత్తమగుచు మిత్తరిల్ల. 153

ఉ. వచ్చిన విప్రవర్యు నక వారిత భక్తి నమస్కరించి మీ
రెచ్చటనుండి వచ్చితిరి యేమి శుభాతిశయంబులం చుదా
నచ్చ పురప్రాకృతుంబలె మహావినయోక్తులతోడ వేడ వా
రిచ్చటి వర్తమానములు నెల్లవచింపుటయున్ ముదాత్ముఁడై. 154

సీ. మీ దివ్యదర్శనంబు దినంబగుడుమా
మక మనో రథములూరక ఫలించె
మీ వచోమృతము నెమ్మిని గ్రోలసంతృప్త
సుమనస్స్థితిఁ జెలంగు చొప్పగల్గె
మీ సత్ప్రశంసముల్ స్నేహకృద్వార్తలు
వినగ శ్రోత్రానంద విభవమొదవె
మీ సద్గుణగణవిలాసంబు లారయ
నత్యున్నతస్థితి యబ్బగల్గె.

తే.గీ. నెల్లసంపదలొగి నుల్లసిల్లె పల్ల
వ్రొప్తివనుఁ గూర్పగాఁ గృపయుంచుడనుచు
వితతమణిభూషలిడి బహుమతుల వేడి
మగుడ బనుపుటయును వారు మగుడఁ జేరె. 155

శా. అమ్మా మేమట కేగఁ జూచుతరి నేనత్యాదరస్వాంతుఁడై
మమ్మం బెక్కు సపర్యలందనిపి మీ మాటల్ వచింపంగఁ దా
నమ్మోదంబున నాలకించి బహు వాంఛాస్ఫూర్తిచే మిమ్ములన్
నెమ్మిం గాంచఁగఁ గల్గుటెన్నఁడనుచున్ వీక్షింపుచున్నాఁడొగిన్. 156

వ. అని విప్రులు శ్రీకృష్ణుని వృత్తాంతంబంతయుం దెలిపిన రుక్మిణీదేవి య
మందానందమరందబిందు సందోహ నిష్యందమాన మానసాంభో
రుహ ప్రసూనయై తానలయునపుడెల్ల యదువల్లభుసన్నిధికిని జాత్రి
తులను బనుపుటయు నతండును దానిచ్చగించునపుడెల్ల దూతికలఁ

బంపుటయుం గలుగుటచే నొండొరులును బరస్పరానురాగ సంబద్ధ
సుమనఃప్రవర్తనంబులం బెద్దయుం బ్రొద్దుగడుపుచుండ. 157

భీష్మకుడు రుక్మిణికి వివాహము సేయుటకు యత్నించుట.

ఆ-వె. భీష్మకుండుకూతు । పెండిలి సేయంగ
దలచివిభుడెవండొ । దెలుపుడనుచు
సచివబంధుమిత్ర । సందోహములఁగూర్చి
యడుగుటయును వార । లతిముదమున. 158

ఉ. కొందఱు మాళవేంద్రునకుఁ । గొందఱు మద్ర మహీశుపట్టికిన్
గొందఱు కొంకణేశునకుఁ । గొందఱు కెంకణ భర్తకున్ మతిన్
గొందఱు వంగనాథునకుఁ । గొందఱు బర్బర భూమిజానికిన్
గొందఱు ద్వారకావిభున । కున్ సుతనీఁ దగునంచుఁ బల్కినన్. 159

చ. ప్రథమసుతుండు రుక్మి సభఁ । బార్థివు ముంగలి కేగి చైద్యభూ
మిథవునకీఁ బొసంగునని । మించి వచింపగ భీష్మకాదులున్
బధిరుల భంగి పీనులిడి । వాని మతంబు గ్రహించి మంచిదా
విధమొనరింపుటొప్పనుచు । వేడుకమీఱఁగఁ దత్ప్రయత్నులై. 160

ఆ-వె. శుభముహూర్తమొందు । జూచి పురంబెల్ల
వజ్రమణి విశేష । వైభవముగఁ
దగనలంకరించి । తద్దయు శుభలేఖ
ననుపుటయును చైద్యు । డును ముదమున. 161

చైద్యుఁడు పెండ్లికి దరలి వచ్చుట.

ఉపమాలంకారము.

సీ. తొలిమొగుల్ మెఱుపులఁ । దళుకొత్తుగతిమణి
ప్రకరభూషితమదేభములు గదల
గగనయానోచ్ఛల । ద్గంధర్వవరులట్ల
తత్తడుల్ బూనిరాహుత్తులెసగ
అక్షీణపక్షవి । హారప్రకార గో
త్రాధరంబుల క్రియ । రథములడర

హరిహయపరివేష్ట । నాచారులగుగురు
ప్రతతిపోలిక గురు । ప్రముఖులలర

తే–గీ. సకలమంగళ వాద్యాను । మంగ మొప్ప
వందిమాగధబృంద కై । వార మొసగ
బంధుసంతానమిరుదెసల్ । బలసి సెలగ
కుండినము జేరెఁ బెండిలి । కోర్కెలూర. 163

ఆ–వె. పురికిఁ బెండ్లి వార । లరుగు చెంచుటఁగని
వెగటుపడివివాహ । విభవమిపుడె
వేడికొనదగారె । విఘ్నంబుసేయుమం
చనుచుమిత్రుజేరి । యనిరి యెనిట్లు. 164

క. ననుఁ బెండ్లి జేసికొనఁగృష్ణునిఁగోనిరమ్మిటకనుటయు । శుభమస్తనియా
తనుద్వారకాపురికపుడు, జనికృష్ణునిమ్రోలనిచటి । చందముబలుకన్.

కృష్ణుండు చైద్యులంద్రుంప కుండినమునకు దండెత్తివచ్చుట.

మ. రణనిర్వాణముమాడ్కి వార్త చెవిదూరన్ శౌరి నేదుష్టశి
క్షణముం జేయజనించి తేనియిపుడీ । చైద్యావనీపాలురన్
క్షణమాత్రంబునఁద్రుంచి రుక్మిణిని యాశ్వాసించెదెత్తుగాంచుచున్
పణగోపత్రిపురాసురాంతక నిరీక్షప్రక్రియంగాల్చుచున్. 166

మ. రథమాయత్తముజేసిదారకుడుదే । రమ్యంబుగానెక్కి శా
ర్ఙధనుఃకాండదరారినందకగదల్ । ప్రాజ్యస్థితిందాల్చిశౌ
ర్యధృతిశ్రీరసముప్పతిల్లఁగరుణా । రమ్యాత్ముఁడై చారుపా
న్యధరీభూతశతస్మరప్రథితుఁడై । యాప్రోలుదాఁజేరినన్. 167

క. కనుఁగొనిచైద్యమహీశులు, ఘనవిక్రమచటులభటని । కరయుతులై పై
కొనిశరవర్షముగురియుచు, మునుకొనిశ్రీకృష్ణువెని । మూగుచురాగన్.

పంచచామరము.

శిలీముఖప్రకాండముల్ నశింపఁజేసియాత్మదో
ర్బలంబుసంబొనర్చి శార్ఙ్గపాణియై యెదిర్చితా
బలారిశైలపాళినొంచు భంగిఁబొంగితన్నృపా
వళింజలంబుబెంచిత్రుంచె వాసవాదులెన్నఁగన్. 169

స్రగ్విణీవృత్తము.

ఆలమందొక్కఁడిట్లార్భటీయుక్తుఁడై
క్రోలఁగన్ రాజులన్ గూల్పఁగాఁజూచియు
ట్లీలయేయంచునాహింపఁచిభీతాత్ములై
చాలసాళ్వాదులాశ్చర్యమున్ బొందగన్. 170

ఉ. పోరికిఁగొందఱస్ఖలితబుద్ధినిఁగృష్ణుజయింపనుర్విపైఁ
బారిరికొందఱేలశిశుపాలువివాహము మాకటంచు వి
స్తారకృతమతిన్ మనలఁదాభరియించునటంచుఁగేశవున్
జేరికొందఱయ్యెడలఁ జేతులుమోడిచిభీతితోఁ బగన్. 171

అట్లు సాళ్వసరపాలబృందంబులెల్లఁ భిన్నంబులై నిశ్చలితాంగస్థుల వీక్షింపుచుండఁ గృష్ణుండు శరవర్షంబుగురిపింపుటమాని సుందరీలలామంగొంపోవుటమేలని తలంచి రుక్మిణీమణి కడఁకేతెంచి. 172

శా. భేరీఘోషమునన్న జాంబమునుల్ నిర్లింపగనంభోధిగం
భీరంబొప్పగసింహనాదములనొక్కింపబుగాఁజేసి దు
ర్వారప్రౌఢిఁబసంతిఁగైకొనుచుఁతాఁ నంబోయెఁ బత్రీశుడా
స్వారాజేంద్రుడయించిదివ్యసుధ నిచ్చెంగొన్న చందంబునన్. 173

తే-గీ. ద్వారకాపురికేతెంచు వార్తదెలసి
పురజనంబులు కౌతుకస్ఫూర్తులగుచు

హరికెదురుగనునీరాజ నాదులుగొని
శౌరిదర్శించిముదినిహర్షముదలిర్ప
వారువారునుఁబురికరుదేరిరంత. 174

ఉ. కుండినమందుభీష్మకముఖుల్ హరిచందముగాంచియీతఁడో
క్కండుమహీశులందునిమికన్యకుఁగైకొనిపోయెదోర్బలా
ఖండలుఁడీతఁడాత్మజకుఁ గాంతుఁడుగాఁ దగునంచువారలు
[illegible]ంచుకుతూహలంబునను [illegible] శౌరిఁ[illegible]టికిన్. 175

క. అలిగినవారలఁగనుగొని, హరియాతిథ్యములొసంగి యనుపమలీలన్
బరగవిందులొనర్చుచు, బరిచర్యలు జేసిభక్తి భావంబెసగన్. 176

## రుక్మిణీ శ్రీకృష్ణులపరిణయము.

వ. అంత ద్వారకాపురంబున కేగిన సకలబంధుబృందంబులు నితాంత సం
తోషస్వాంతులై రుక్మిణీ శ్రీకృష్ణుల పరిణయంబొనరింప దొడంగి
గురుపురోహితులవలన సుముహూర్తంబు విచారించి యథోచితమంగళ
తూర్యారావంబు లుప్పతిల్ల వైవాహికప్రయత్నంబులు జేసి నిఖిల
బంధుమిత్రపురోహితామాత్య ప్రముఖులెల్ల సభాసీనులై వధూవ
రుల మంగళస్నానంబుల కనుజ్ఞనొసంగుటయు. 177

చ. [illegible] తెఱనుబ్బుగుబ్బలులఁ గ్రాలెడువాలుగుచంబులందు
య్యెడగదలన్ శ్రమాంబుకణబృందనిషిక్తపరిస్ఫురితదా
స్పద తిలకంబుజారిపడియె పయోరసమూరెడులీగనాగఁగా
సపరివెలంటిద్వారకనంబుచపాణులు వేరువేయగన్. 178

సీ. తళుకుపాంబొమ్మలకుపులిగడిగినరీతి
సౌరభాంబువులమజ్జనమొనర్చి

సౌదామినులఁగప్పు శారదాంబుదముల
కరణి దువ్వలువలు గట్టఁగూర్చి
అంభోజమున వ్రాలు నళిడింభ మట్టుల
కస్తూరిబొట్టుచొక్కముగఁ దీర్చి
మధుకాలసుమపలచ్ఛదయుక్తతరువన
క్రమమున మణిభూషణ ములమర్చి
తే.గీ. నూపుర ఝుణంఝుణ ధ్వనుల్ దీపితముగ
కామినులు రుక్మిణీదేవి గర్గముఖ్య
మునులు శ్రీకృష్ణమూర్తిని భూరిపీఠ
ములకుఁ దెరచాటుగాఁ దెచ్చి ఎలఘుఁమతుల. 179

వ. ఇట్లిరువురిని సుఖాసీనులం గావించి నిగమ చోదితంబుగా వైవాహిక
ప్రకరణంబులెల్ల సేయించి శృంగార గీతాభిరామంబుల ముత్తైదువ
లిరుగెలంకుల ముత్తైంపుసేరా జనంబులెత్తి పాడుచుండఁ జిందిపల్లె
వంబుల వెలబ్రాలుగొని వధూవరుల చెంతనింతులందీయ నక్షతారో
పణోత్సవానుషంగులై. 180

సీ. పలుముత్తియపుఁజాల బ్రాలుసతీపతు
లొండొరులపై బోయుచుందు నెడల
హరియింతిపైఁ బోయ న వనితతనుసోకి
కదుసువర్ణచ్ఛాయఁ గ్రాలిరాల
ఘనరుక్మిణీశిర గళితంబులై కృష్ణు
పై బడినీలాల బాతిజార
శరధిరాట్కన్యకాంశజపై పరుదు ద్రోయ
వజ్రోపలస్వభా వముపహింప

తే-గీ. శాస్త్రవిధిగాఁగ భక్ష్యభోజ్యప్రశస్త
భుక్తి నిఖిలజనముతుష్టిఁ బొందుచుండ
సుమవిమానోత్సవంబులు సొంపునింప
నుప్పతిల్లెఁ గళ్యాణ మహోత్సవంబు. 181

వ. అట్టియెడ. 182

మ. హరిముఖ్యుల్ వినువీధిజోత లిడఁగా నానందులై భోగినీ
హరిణేక్షుల్ నటియింప భక్తియుతులై యాసేతుశీతాచలాం
తర భూనాథుల సర్వ్వవస్తుమణిసంతానంబులంబూని శ్రీ
హరికర్పింపుచు మ్రొక్కిలనిల్చిరి సముద్యత్ప్రాంజలీబద్ధులై. 183

వ. ఇట్లత్యంత కళ్యాణ విభవంబులు ప్రభవింపఁ జేయుచుండ నాకళ్యాణమ
హోత్సవానంతరంబున శ్రీకృష్ణుండు పట్టాభిషిక్తుండై యరుగుదెం
చిన బంధుబృందంబులఁ గతిపయకాలంబు నిజమందిరంబున నుందు
లందనిపి వస్తువాహన భూషణాంబరాదులచే బహూకరించుటయు వా
రునుతమతమ వాసంబులకుం జనినయనంతరంబు భీష్మకుండునుం గుండిన
పురంబునకుం జేరి యచటి చందంబులెల్ల నెల్లరకుం దెల్లంబుగాఁ దెలిపి
యంతంత దనసుతాజామాతల రావింపుచు వారల కనూనంబులగు
విభూషణా మూల్యమాల్యాంబరాదుల నొసంగుచు సంతసంబునఁ గుం
డినపురంబు బహుకాలంబు పాలించెనంత. 184

తే-గీ. ఇతనివంశజులైనభూపతులనేకు
లుభయలోకప్రసిద్ధిగా నురుతరప్ర
మోదమున నేలిరి కలియుగాదిసమయ
మవధిగా నీతిచేఁ గుండినాఖ్యపురము. 185

క. అనుచుమునాశీరునకతి; వినయంబెనయఁగ నద్రిలోకవిదుఁడగువనజా
సనమానస తనయుండాగి, వినిపించెను కొండపీటివిభుచరితంబుల్.

## షోడశ దళ కమల బంధము.



షోడశదళకమల బంధసీసము.

సీ. సద్వ్యకాంగ శ్రీనిధానవక్షస్థలా
శ్రితకోటిరక్ష గుణైరుతరదండ
సయహారిలసద ఖండమనోజ్ఞరుక్కాయ
రారాజదుత్తాలకై వైరిమార
భామాంకధరబ్రహ్మ పరకీటిపతిరూప
యమనుతపదబ్రహ్మాది గేయ

కౌండదాలుపభూరికగుణమండనాఢ్య
సౌఖ్యవిహారవీనప్రకటితతురగ.
తే-గీ.కుటిలదానవమర్దన చటులతేజ
రమ్యమణిపూరిత సుహార రాజపుత్ర
పుష్కలాంభోద సదృశ సముజ్వలాంగ
దళితభవ శశినిభముఖ తరణికులజ. 187

నాగబంధము.



చ. శౌధి విహార సారతర సారససన్నిభలోచనామనో
హరఘనకాయసూర కమలామలవక్త్రరమానివాసవా

నరవచన ప్రచారకధర నాధనరమ్యయశో విధావరా
దరముని లాభకారమురర దార సమస్తప్రధానతారకా. 188

శైలబంధము.




క. హరినుత యశోమహాత్మా, దరసత్ప్రజ్ఞాప్రకారర తారకసారా
సరసీరుహనిభవదనా, మురముఖదైతేయ హరణర మునిజనభరణా.

గద్యము. ఇదిశ్రీమజ్జగత్ప్రాణ తనయ వరప్రసాద లబ్ధ కవి
తార్కిక ఆపస్తంబసూత్ర కౌండిన్యసగోత్రపవిత్ర
వివిధ విద్వన్ముఖ సరోజాతమిత్ర మద్దులపల్లి వంశదీ
పక వేంకటప్పయాభిఖ్య తనూజాతక సుకవి
జనసేవక గురుబ్రహ్మానామ కవిరచితంబగు
శ్రీకొండవీటి చరిత్రంబునందు
ప్రథమాశ్వాసము.

శ్రీరస్తు.

# శ్రీకొండవీటిచరిత్రము

## ద్వితీయాశ్వాసము.



క. శ్రీమాని నీమధుకరా,
స్తోమానందాభి రాము సువ్రతకామా
భూమండనప్రశుతభూభృ,
ద్ధామాకోదండరామ దనుజవి రామా. 1

క. అవధారు నారదముని, ప్రవరునిచే నాదితేయ పతివినియంతృ
దవిలి పవిత్రస్థితినొందఁ, నవలికథం చెల్పుమన్న నతఁడిట్లనియెన్ . 2

తే-గీ. కలియుగంబునఁ బోలిబహు కాలమర్క-
చంద్రవంశజులగు నృపుల్ సాంద్రగరిమ
శాశ్వతైశ్వర్య వైభవ సమితి వెలయ
మేటులై యేలిరి కొండవీటిసీమ. 3

వ్యవస్థ.

సీ. శేఖరధారణ చేఁగీర్తిగని దుర్గ
వరులు నాఁ జెలువొందు ధరణిభృతులు
సాంద్రప్రదోషముల్ సడలఁద్రోయుచు
శతపత్రనిర్మదమునఁ బరగు నినులు
భోగివిస్ఫూర్తిగూర్చి పొసఁగ యనంతాఢ్య
పదభూతిఁ గను చక్రి వర్తిఘనులు
కువలయప్రీతిచే కొనిసత్ప్రథమునంటి
ప్రకటకళావాప్తిఁ బరగు రాజు

తే-గీ. లలరిరశ్రాంతవిశ్రాణ | నార్యవర్య
మానితాశీర్వచోవర్ధ | మానభూన
భోంతరేద్ధమహైశ్వర్య | వంతులశ్వ
పతిగజ పతినరపతి స | ద్వంశులనగ. 4

క. ఆవంశత్రయమున నతి, పావనమై యరినిరాస | భావనమైల
క్ష్మీ విలసిత గజపతికుల, మానవనతావన విధాన | మైవిలసిల్లెన్. 5

వ. ఏతద్వంశవరేణ్యుండు. 6

విశ్వంభరదేవునికథ.

సీ. శ్రీమద్రమావధూ | టీమనోహరభవ్య
పదసువర్ణాంభోజ | భాసురంబు
పతితపావన మహోన్నతసుధీజీవన
సారవిద్యామృత | పూరితంబు
విపులకృపాసార | వీచికాంతరచల
ద్విద్వత్కవిమరాళ | విలసితంబు
బహుళదుర్జనమద | ప్రహరణ పరిమాణ
క్షీణకోపబుద్బుద | సంచయంబు

ఆ-వే. నైనమానసాంబు | జాకరుఁడామ్నాయ
మూర్తియభిమతప్ర | పూరితాశ్రి
తనిచయుడరివనద | హనుఁడు విశ్వంభర
దేవభూవిభుండు | కోవిదుండు. 7

తే-గీ. సౌఖ్యముగశాలివాహన | శకమునందు
పదునొకొండవదగుశతా | బ్దమునతడు
క్షీణతా విరహితశీత | కిరణుఁడనగ
ద్వాదశాబ్దంబు లిలనేక | దళభరించె. 8

క. ఆనృపతికిఁ గల్గిరిస, త్సూనులు నల్వురురణోగ్ర | శూరులుశౌరి
ధ్యానపరాయణులుజయ, ధ్యానోపేతాంగణులును | వారెవరినిన్. 9

సీ. ఏవిభుం డఖిల వి ద్యావి శేషజ్ఞత
గణపతి దేవ వి ఖ్యాతిఁగాంచె
నేరసజ్ఞుఁడు మ్రొక్కు వారిసత్కృపఁబ్రోవ
బాలభాస్కరదేవ లీలగాంచె
నేనేతిమదవైరి దానవాళివధింప
నరసింహదేవుండ నంగమించె
నేభూవిభుండు ధరాభరంబువహిం
విశ్వంభరుండన వినుతిగాంచె
తే-గీ. నాఁగహించిరిబాలేశ వీరగణప
తిప్రభుఁడుబాలభాస్కర దేవవిభుడు
శ్రీవిభాసితనరసింహ దేవనృపుడు
సాంద్రగుణపాళివిశ్వంభ రేంద్రమాళి. 10

క. గజపతి వంశాభరణులు,
వృజినోత్తరణానుకూల వేషావరణుల్
విజితార్క సుతవితరణులు,
విజయరమాసహితమహిత పృథులగుణమణుల్. 11

వ. ఇట్లొప్పు నప్పుత్రిచతుష్టయంబును నఖండదోర్దండ కోదండ పాండిత్య వైఖరీ విశేషంబున దినదిన ప్రవర్ధమానులై యొప్పుటయు. 12

గణపతి దేవు వృత్తాంతము.

క. శ్రీలీల లలరునానర, పాలచతుష్టయమునందు ప్రధముఁడు ధరణీ
నాళీకాక్షీభృతినా, బాలేశ్వరవీరనృపతి ప్రభువై యొప్పెఁ. 13

క. ఘనసింహాసనపతియై, తనరుచుధర్మముచతుష్ప దములనడుపుచుఁ
మనునిభవినీతిలీలా, జనితస్థితిపాలనంబు సలుపుచునుండఁ. 14

సీ. సకలయాచకబృంద శుకశారికాళికే
సచివుహస్తంబుర సాలశాఖ
విద్వత్కవిమరాళ వితతికేఘనసభా
స్థానంబుమానస సరసీమ

సముదారినృపకుంభి ॥ సమితికేమంత్రీంద్రు
నురుయోచనలుశృంఖ ॥ లోత్కరములు
ప్రకటవిద్యాలతా ॥ పాళికేమహనీయ
వాక్సీమవిపులాల ॥ వాలతలము.

తే-గీ. అతఁడుహిమశైలసేతుమ ॥ ధ్యస్థశస్త
యశుఁడుగణపతిరాజద ॥ యావిశేష
పాత్రుఁడఘహరకాశ్యప ॥ గోత్రుడగుచు
నలరెశ్రీగోపరాజురా ॥ మాహ్వయుండు. 15

శా. రాజ్యాంగంబులుబెక్కునేర్చిదృఢశౌ ॥ ర్యప్రౌఢిమన్భూరిసా
మ్రాజ్యశ్రీజనరక్షణేక్షణకృపా ॥ రమ్యాత్ముఁడై నిశ్చల
ప్రాజ్యప్రాభవమొప్పశాత్రవభిదా ॥ పారీణుఁడై సత్కళా
పూజ్యత్వంబునమంత్రిపుంగవుడనన్ ॥ బొల్పొందెనిద్ధారుణిన్. 16

వ. అట్టియెడ. 17

క. తనరాజ్యంబునభూసుర, జనులకుచితవర్తనములు ॥ జరుగుటలేమిన్
ఘనకరుణన్ స్వజనచయా, వనయనురామాయణో ॥ క్తిశివసగఁదలిర్పన్.

క. ఏనృపాలవరకృప, చేనీవిప్రప్రతతికి ॥ జీవనవసతుల్
బూనిచేనొసరించితి, నేనిలభింపునికి నాకు ॥ నిహపరఫలముల్. 19

వ. అనితలంపుచు నిజమనోరథ సఫలీకృతాభిలాషా యత్తచిత్తుండై యే
తన్నృపాలకృపా విశేషంబున ధర్మశాసనపూర్వకంబుగాభూసురకోటికి
షోడశమహాదానంబులిడుచు తరుణంబునకు నిరీక్షింపుచుండ. 20

తే-గీ. భువినివేయుఁనర్వదియేడు ॥ భోగుశాలి
వాహశకగతరక్తాక్షి ॥ వర్షభాద్ర
పదబహుళపక్షదర్శభా ॥ మదివసమున
సర్వభయదరవిగ్రహ ॥ సమయమయ్యె. 21

## సూర్యగ్రహణ వర్ణన.

వ. సురలతిభీతిఁదూల దితిజుల్ కుతుకంబునఁ దేలఁ బత్తులు
ప్పరమున డిగ్గిసిడముల ॥ ప్రవాలనభంబు సనీలమేఘవి

న్తరరుచిఁ గ్రాలతారకలు । దారగతిస్థితిఁ గ్రాలఁగోసము
త్కారములు క్షేత్రముల్విడచి । తారగఁజాలతి మిశ్రమేర్పడన్. 22

క. దిక్కరులుక్కుజెదరిబడ, చుక్కలగుమి గగనవీథిఁ । జూడ్కులబడఁగన్
పిక్కటకంధులుగలఁగఁ, దిక్కులుగాన్పించకుండ । దిమిరముగ్రమ్మెన్.

భుజంగప్రయాతము.

క్షితింజంతుజాలంబు । జేట్పాటుజెందన్
శతారంబుగోత్రంబు । చక్కాడు తేజో
భృతిన్ కేతువజ్రాస్త్ర । బింబంబుపట్టెన్
పతంగోపరాగంబు । వాటిల్లెనంతన్. 24

వ. మఱియు నయ్యుపరాగంబు దివాంధకార బంధురంబగుటను లూకాలోకంబును కుహూసుఫల సమాగత కృష్ణాత్మక ద్విజప్రతీతంబగుటను ధ్యానంబును పతంగగమన భంగీకరణంబగుట సువృష్టియును సముల్లసితతారావిరోచనసమాకీర్ణంబగుట బృహస్పతీ నికేతనంబును కేతుప్రభాసితంబగుట రథంబును పర్వానుగతంబగుట భారతంబును నిత్యకాండంబుననుకరించి ముప్పిరిగొన్న కప్పున నుప్పరంబెల్లఁ గప్పికొని నెప్పగిదినైనఁ దెప్పరిలఁ జొప్పడరాని మహాదాశ్చర్య విశేషంబున పరిశోషిత ధరామండలంబై యున్న యెడ. 25

క. సర్వోత్కృష్టంబగునా, పర్వంబున స్నానవిధులు । పచరింపంగన్
సర్వజనుల్ తీర్థములకు, సర్వులిడుచునుండిరధిక । భక్తిదలిర్పన్. 26

రాజు కృష్ణాస్నానమునకేగుట.

చ. తదవసరంబునన్ నృపతి । తాజలకంబునకేగుదెంచనె
మ్మదిఁదలపొందితద్దయున । మాత్యునిగూరిచి తీర్థమాడఁబో
యెదఁ బుపురోహితప్రముఖు । లెల్లరురానియమింపునావుడున్
ముదమునఁ దానభీష్టఫలమున్ గొననోపు నటంచు నెంచుచున్. 27

క. భూసురుల కెల్లతనమది, లోసలుపగనెంచు తెఱఁగు లెలువినిచిరాకం
డీసుమ్మీయనియనుజ్ఞనుఁ, జేసినృపాలునకువినయ । చిత్తమునవనున్.

క. దేవాభవదాజ్ఞనుశిర, సావహించికొనివిప్రసంతతినెల్లన్
రావింపఁబనిచినాఁడను, వేవేజననొప్పస్నానవిధులొనరింపన్. 29

ఉ. నావుఁడుగౌతుకాన్వితమనంబునపావనతీర్థసేవనా
భావమునన్సువర్ణమయపాత్రలమంగళవస్తుసంతతుల్
గ్రేవలఁబూనిసేవకులొగిన్జను దేరనమాత్యయుక్తుఁడై
తావెడలెన్గజంబుననుధామయవాణికిఁ గృష్ణవేణికిన్. 30

క. చనిచని గంగంగనివం, దనమొనరించిపితృతర్పణములిడినీరం
బుననిలిచిబాడబులనే, రినిగానకఁగలకమదిని రేగిసచివుతోన్. 31

ఉ. ఏరిపురోహితప్రముఖులేరి మదాశ్రితవిప్రబృందముల్
ఏరికినేరికిందెలిపి తెప్పుడురానియమించితింతకున్
వారలరామికేకతమొ పల్కుము మేమికస్నానకృత్యముల్
కోరుచునెట్లునాపుడతి దీనతఁదోపవచించెనమ్ముఁడై. 32

శా. ఏవిప్రుండనమాత్యపుంగవుఁడప్పృధ్వీశాభవద్భృత్యుఁడన్
నీవాత్సల్యదయారసంబునెదనెంతేకోరియున్నాఁడనం
భావింపందగుమన్మనోరథము దీర్పంజెల్లుసంకల్పమున్
నేవిజ్ఞాపనసేతునావుడు నసందేహాత్ముఁడై యిట్లనున్. 33

తే-గీ. సంతసించితినీదువాక్సరణికిపుడు
స్నానకృత్యంబులొనరింప సమయమిదియ
గాననవధానివగుచుసంకల్పవిధులు
దెల్పుమననట్లచేసెన నల్పమతిని. 34

వ. తదనంతరంబ యానరపాలోత్తంసుండు సముచితోత్సుకుండై నిగమ
చోదితప్రకారంబునఁగృతస్నాతుండై పితృతర్పణాదినిత్యకృత్యంబులం
బరివర్తించి యక్షీణకృపాకటాక్షంబువీక్షణంబులనమాత్యునీక్షించి.

క. కోరుమునీకోరికలం, దీరుపఁగఁదలంచితిభవదీయసమయవా
క్పారణమునకరుదగువి, స్తారఘృణాగణ్యరామ సచివవరేణ్యా. 36

## మంత్రి ముద్రాదానమును గోరుట.

శా. ఆలోకించి యమాత్యమౌళి పరమా । హ్లాదంబు సంధిల్లఁగా
నీలంనిల్చినమానవేంద్రునెదుటన్ । గేల్దోయిసంధించిమీ
లీలన్ ముద్రికఁబూని యీమమిలఁ బా । లింపం దలంపొందె భూ
పాలోత్తంసమమన్మనోరధము సా । ఫల్యంబు నొందింపుమా. 37

వ. అనినవిని. 38

మ. ఒక యీమంబునఁగల్గు భోగమునకై । యయూర్జిల్లి గాంగేయకా
ప్యకరీంద్రాశ్వపురాగ్రహారపశుధా । న్యవాత్రముల్మీవృకో
దకయున్నాఁడవ యీమదీయ దయఁజే । ర్పన్ సార్థమేమింకద
ర్పకసౌందర్యవిశేష నాపుఁడుఁ బ్రహ । ర్షం బొప్పఁదానిట్లనున్. 39

క. ఏవేళ మాకునిచ్చలు, తావకసముఖంబె పెన్ని । ధానము కొలలిం
కేవియు లేవిక గణపతి, దేవా నే యేలపనుమ । తీపరిపాలా. 40

చ. అనవినిసంతసించి నృపు । డట్టుల సేయనకాఁదలంచి నె
మ్మనమునఁ బ్రేమయుప్పతిల । మానితసద్గుణుగోపరాజురా
మనసచివాగ్రణిన్ గనిస । మాహితచిత్తముతోడఁ ద్రొక్కియీ
జనపతిసంతసింపుచునొ । సంగెనుసోదక వాక్యదానమున్. 41

వ. తదనంతరంబున నయ్యిరువురును సంతోషవిశేషంబున భృత్యప్రముఖ
పరివేష్టితులై నిజాగారంబులకరుగుదేరి రంత. 42

సీ. సచివుండులోకిక । జనములరావించితనదుమనోరధం । బునునచించి
ధరణీశుకడకేగి । తానొసరించిన తెరగువారలకుఁబో । ధించిమించి
మనదేశమందు బ్రహ్మస్థాప్యములొనర్చియుత్పత్తిసాఫల్య । మొందనెంచి
యుంటిగావున మీరలుత్సుకులై కొండవీటిరాష్ట్రంబున । వెలయుసర్వ

తే-గీ. పురములకు విప్రులధిపులై । పొసగివారి
వారి వంశపరంపర । వర్తనలుగ
భూమిముఖరషోడశదాన । ములకు ధర్మ
శాసనంబుల దెండుమా । సముఖమునకు. 43

తే-గీ. అనుచుఁ ద్రుటిమాత్రమున వారి । దనిపి దాన
ఖండభూభరణోద్దండ । హాండితప్ర
చండదోర్దండుఁడై సభా । స్థానమందు
జేరి నృపతిఁ బరాకులఁ । జేరిపలికె. 44

క. రాజా వైభవజితనుర, రాజాముఖచారుతాతి । రస్కృతరాజా
రాజద్రవితేజా సాం, భ్యాజయగజపతికులీన । గణపతిరాజా. 45

తే-గీ. అవధరింపుము బాలేశ్వ । రాఖ్యవీర
గణపతిప్రభుచంద్రను । త్కామితంబు
కీర్తనవితారుబల్కనే । తెంచినాడ
భద్రపీఠస్థుఁ జేయుఁడీ । ప్రేమమెసఁగ. 46

వ. అనుటయు బాలేశ్వరాగ్నిరాణపతి దేవ భూవిభుండధికోత్సుకుండై నవన
వానందాద్భుతంబులు మనంబునఁ బెనంగొన నవ్వింతఁగనుంగొనన భి
లషింపుచు. 47

చ. కనుగొని మంత్రిశేఖరుని । గాఢకృపారసదృష్టిపాతముల్
బెనగొనఁ బాణిఁ బాణిఁగొని । ప్రీతిదలిర్పగ సింహపీఠిపై
నునిచి నిజాధికారమిడి । నుంగరిముంగర మందుఁ జేర్చి కీ
మునమల రంగ నేలుము । సమస్తధరావలయంబు నావుఁడున్. 48

మంత్రి రాజ్యపాలన సేయుట.

తే-గీ. అధికృతుఁడు కాత్ముఁడై ప్రభు । నాజ్ఞ నడసి
భద్రపీఠస్థుఁడై నృప । ప్రాభవమున
ఘనతరంబగు రాజ్యపా । లనముఁ బూని
దండిసభను నిండోలగం । బుండు నెడల. 49

క. తనుపనుపనాశ్రితులువేఁ, జేనిశిల్పిప్రచురతామ్ర । శాసనవిలతుల్
గొనియాత్మముఖమునకుం, జను దేరగఁ జూచిదరహా । సవదనుండై.

స్రగ్ధరావృత్తము.

రుద్రశ్రీశౌర్యధుర్య । శ్రుతికథి తపదా । గూఢబాహుండునీత్యు
న్ముద్రవ్యాపారకార్యా । ద్భుతచతురసుధీ । పూర్ణదివ్యానుకంపా
భద్రప్రాచుర్యచర్యా । పటుడయికమలా । భర్తృకారుణ్యసిద్ధిన్
ముద్రించెన్ దామ్రపత్రం । బులమహీసురుడా । భూమివృత్తిక్రియాదుల్.

వ. ఇట్లొక్క త్రుటిమాత్రంబున నసంఖ్యాపరిమితంబులగు శాసనంబుల మర్పించి. 52

గోపరాజు రామన్నగారు కరిణీకములుద్ధరించుట.

సీ. వివిధవిద్యావిశే । షవిధానశేషాహి
వేమప్రచారులా । ర్వేలవారు
విపులవిశ్రాణన । విఖ్యాతిజితశిబి
హరికుమారులునంద । వరపువారు
ప్రతిపక్షవారణ । ప్రథితమంత్రాంగవి
జ్ఞానశారదులాది । శాఖవారు
దేశపాండ్యసమాజ । దేశాహిరాజసం
కులతాపరులుమంత్రి । కులమువారు

తే-గీ. మొదలుగా గల్గులౌకికస । మూహములకు
రవిశశాంకనక్షత్రగో । త్రాధరంబు
లంబునిధులెంత కాలము । లంతకాల
మనుభవింపుడనుచునుస । మాదరమున. 53

ఉ. ఇచ్చైన శేమభూదివిజ । బృందములెల్ల నుతింప వేడుకల్
హెచ్చగవిద్యముల్ వసన । హేమవిభూషణభూప్రియుక్తిగా
నిచ్చెంబురాధికారముల । హీనమహాగణికాప్రధానతా
భ్యుచ్చయవృత్తిశాసనస । ముద్ధరణంబొనరించిరచ్చటన్. 54

తే-గీ. గ్రామణులుగని యోగిసం । ఘములఁ జేసి
వైదికద్విజకోటుల । వారికెల్ల

హవ్యకవ్యములకునాశ్రితాళిగాగ
ద్విజులకిటుజీవనాప్తసంస్థితులొనర్చి! 55

మంత్రి ప్రభువునకు రాజ్యమునరలనిచ్చుట.

వ. అట్టియెడనీకొండవీటిపురంబునకుఁ గౌశికసగోత్రజులును. నాపస్తంబ సూత్రులును నగు కొండాన్వయుల కేకభోగముల కరిణీకంబునడిపి తద నంతరంబయ్యమాత్యచూడామణి ప్రభుత్వకాలనిర్ణయానంతరంబున నమ్మహీశుపాలికింజని స్వధర్మానుష్ఠానంబునన్నృపతింజేరి దేవాయుష్మదను గ్రహాతిశయంబున మదీయమనోరథంబు దీర్చుకొంటినిక కాలాతిక్రమ ణంబయ్యెగానముద్రికంగొండనియర్పింపుటయు నృపాలుండుభవదీయ ప్రభుత్వప్రకారంబభినయింపుమనవుడు సవినయ వివేకభాషణభూష ణుండై యిట్లనియె. 56

మ. ఘనమాతావక రాజ్యమందుసకలగ్రామాధికారంబులఁ
జనితానందనియోగిభూసురులకుఁ గొసాగించితద్వ్రాతే
ఖనముల్ సేయుచు గొల్వనేర్పరచిరక్షోద్వృష్టి తాంబూలచం
దన హేమాంబరరత్నయుక్తముగభూదానంబులంజేసిశా
సనములుగ్గార్చితినీయశంబుభువినాచంద్రార్క సత్ స్థాయిగాఁ! 57

తే. అస్థిరములుశరీరముల్ లా స్తలేని
చిత్తములనుంటిమికజన్మసిద్ధమనకు
నగుటకిహపరసౌఖ్యంబులందగణిక
సరణిఁజేసితిభూసురస్థాప్యములను. 58

వ. ఎట్లనిన. 59

శాసన శ్లోకములు.

"గోత్రశాస్త్రింబకేందూనాం సంఖ్యాబ్దేశాలివాహనే ।
గ్రామస్థావన్ప్రవృత్తీనాం ప్రథమోగణకాత్రిణీ ॥ ౧
శ్రీమాన్గణపతిర్భూపోగజపత్యన్వయోద్భవః।
అస్తిభూమండలేతస్యబహవస్సంతిమంత్రిణః॥ ౨

తేషాంశ్రేష్ఠతమామాత్యోయాజ్ఞవల్క్యత్తమోద్భ

గోపరాజాన్వయోత్పన్నో రామాఖ్యోగణకాగ్రణీ
రక్తాక్ష్యబ్దేమాసిభాద్రపదేబహుళపక్షకే।
దర్శేర్కగ్రహణేపుణ్యకాలేంగారకవాసరే॥ ౪
గణికానాంవిహితార్థాయసద్యశ్శాసనాయచ।
లిఖితశ్శశిమార్తాండౌయావత్తావచ్చవర్ధతాం॥ ౫
తేషాంరాజ్ఞాగ్రహీత్రూణాంకృష్ణవేణీతటేతథా।
గ్రామస్థావరవృత్తీనాంసాక్షిణాస్సర్వదేవతాః॥ ౬
తస్మాద్ధర్మమిదంసత్యంనిర్మితంయోదురాత్మనాం।
కరోతిచేదన్యథాసౌజాయతేఖరయోనిషు॥ ౭
ఆపస్తంబస్యసూత్రస్యశాఖాభేదఃప్రవుచ్యతే।
యాజ్ఞవల్క్యతివిఖ్యాతోగోత్రంకాస్యపఇత్యథా॥ ౮
విప్రాణాంశాపముద్వేషంవేదబాహ్యాశ్చకారయత్।
తచ్ఛాపవిముక్తిత్వంభానుశక్త్యాద్యపండితః॥ ౯
మాఘమాసేసితేపక్షేవిజయేవత్సరేతథా।
పంచమ్యాంరవివారేచయాజ్ఞవల్క్యద్భుతోభవత్॥" ౧౦

వ. అనియిట్లు వినిపింప. 60

సీ. మంజులశ్రుతిపుటీరంజనంబుగఁబల్కు విని విభ్రమానందవివశుఁడగుచు
సచివుఁగాఁగిట జేర్చి సత్కృపాసంగుఁడై యురుభక్తియుక్తిబహూకరించి.
నీజన్మ సంసిద్ధినెరపితి మజ్జన్మసాఫల్యమియ్యెడసలుపవైతి
వేయుమాటలు దలఁపోయనేటికి పూర్వకర్మానుగతి నాకుఁగలుగదయ్యె

తే-గీ. నైననీబుద్ధి కుశలతనస్మదీయ
జన్మ పావనముగ సూర్యచంద్రతార
లుండువరకుండనీకార్యమొనరిచితివి
నీఋణంబెట్లుతీర్పంగనేతుఁనయ్య. 61

తే-గీ. అనుచుబహువిధములసచివాగ్రగణ్యు

నూరడింపుచు నుత్సాహములుల్లసిల్ల
బలసి సామంతన్న పులుకోపంబుల ప్ర
గించనతి నీతిచేతసమంచితముగ. 62

క. పాలించె బెక్కువర్షము, లోలి దిగంతరమహీశులుత్కటసేవా
శీలస్థితిఁగొలు వఘన, శ్రీలఁ బ్రజల్ దనియఁబుడమిఁచేడియఁగడకన్. 63

వ. తదనంతరంబ యీతనితమ్ముండగు కాకతీయరుద్రదేవభూపతి ప్రభుతులు
పాలించుటయనంతె. 64

రెడ్లవృత్తాంతము.

క. ధరలోనఁగృష్ణవేణ్యా, త్తరమున వై శ్రవణురాజధానియనగ సుం
దరమాచుఁజదలవాడన, గరమమరుందానఁనుండ్రు కాపులెవరగన్. 65

సీ. బాడబాశీర్వాదవర్ధమానైశ్వర్యవంతులైతగువారుదొంతివారు
విద్యావిశేష ప్రవీణతాసిద్ధోషవంతులైతగువారుదొంతివారు
విదురయోగనిదానవిదితతత్త్వజ్ఞానవంతులైతగువారుదొంతివారు
గోత్రావలయభారపాత్రబాహాదానవంతులైతగువారుదొంతివారు

తే_గీ. కంతుసుచిరశరీరులౌదొంతివారు
తుహినకరకీర్తిసారులౌదొంతివారు
ధూర్జటిధనోరుధీరులౌదొంతివారు
శాంతహృద్ధిరులారెడ్డిదొంతివారు. 66

క. ఆదొంత్యాన్వయసంభవుఁ
డైదినదినవర్ధితాఖిలైశ్వర్యయశ
శ్రీదుండల్లారెడ్డిమ
హీందయితసమానవిభవమెసగుచునుండున్. 67

తే-గీ. శ్రీచదలునాడనామపురీవరస్థ
రాఘవపదాబ్జసేవాభిరాముడగుచు
తత్ప్రసాదసమాసాదితప్రమోద
రాజితుండయ్యెఁ దచ్చతుర్థకులభవుడు. 68

అల్లారెడ్డికి ధనములభించుట.

మ. లసితాకారుడుదొంతివంశభవుడల్లారెడ్డి యొక్కర్తుఁడై
కృషి సేయంజని దున్నుచుండగ హాలశ్శృంగోద్ధతిక్షేత్రమ
ధ్యసముత్కీర్ణసువర్ణకుంభనిధి చెంతంగాంచి యానందమా
నసుడై చేకొని రాఘవేంద్రుకరుణన్ బ్రాప్తించెనంచేగినన్. 69

చ. అదివిని పౌరులెల్లరు ధనాహరణేచ్ఛలడాసి రెడ్డిపై
గదియుచుఁ దద్ధనగ్రహణ గాఢదృఢాగ్రహవృత్తి మూఁగనా
పదజనరుండు భీతుఁడయి వైఁబడుటన్ దొలగింపు మంచునా
మదనగురున్ సురావనుని మాధవునిన్ నుతియించెనీగతిన్. 70

అల్లారెడ్డి వీరరాఘవస్వామిని స్తుతించుట.

ముక్తపదగ్రస్తసీసము.

శ్రీరమణీమనోహరహారోదార దారరాగాధార ధారణాఢ్య
దీనావననిదాన దానవాధిప దానదానభృద్వరదాన దానకల్ప
రాజత్కృపాసంగ రంగద్విబుధసంగసంగ హేమకురంగ రంగధామ
మారకోట్యాకార కారణార్పితభార భారసారుణసార సారసాక్ష.

తే-గీ. దశరథసుతాంచదవతారతారకాత్మ
పాలితాఖిలసుజాలజాలవారణ
సంతతస్తుతమునిజనజనకజేంద్ర
రక్షితమహేంద్ర శ్రీవీరరాఘవేంద్ర. 71

## మహారథబంధము.



సీ. శ్రీవిష్ణుతాఖ్యనకేతా వనచిత్సౌఖ్యచలదింద్రనీలకోమలశరీర
ఘోరారినిర్మూలకకోదండదోర్మూలదైత్యరాణ్మండూకకదండశూక
ఖండితరిపుకాండకకాండలోకపిచండ దశరథరాజన్యకతనయమాన్య
మతి. మద్విచారగుకర్వతిపౌరుషబ్రహ్మమయరూపజిష్ణుకకర్మానుతాప

తే-గీ. మన్మథమనోజ్ఞ కాయऽసన్మౌని గేయ
పక్షిరాడ్వా హావాసింధుసంऽవసిత గేహ
రంజితజ్ఞానగుణధామऽరాజనాహు
రఘుకులోదారదుగ్ధవా ऽ రాశిచంద్ర
రమ్యగుణసాంద్ర శ్రీవీర ऽ రాఘవేంద్ర. 72

అంత్యప్రాససీసము.

దివ్యద్యుమణిలస ऽ న్నవ్యరత్నకిరీట
రయకళాద్భుతపత్రి ऽ రాజఘోట
బహుచమూకృతవాయు ऽ భవముఖారణ్యాట
పరిమర్దితోగ్రరా ऽ వణనిశాట
సతతాయనీకృత ऽ స్వచ్ఛభూరికృపీట
భంగీకృతాభీల ऽ వల్మీకాట
దూరీకృతోదగ్ర ऽ వారణేంద్రారాట
సీతాసహావాస ऽ చిత్రకూట
తే-గీ. ఖరవిరాధకబంధరా ऽ క్షసవిపాట
అద్ధిబంధనిరాఘాట ऽ హాతవనాట
అధికపాలితకౌశిక ऽ యజనవాట
రక్షితమహేంద్ర శ్రీవీర ऽ రాఘవేంద్ర. 73

ద్విపదమత్తేభవిక్రీడిత ఆటవెలది తేటగీతి కందగర్భితసీసము
వినతసంరక్షణ ऽ విశ్వసృడ్జనక నానావేష భాషాఘనాఘనాంగ
ప్రనుతపద్మోద్భవ ऽ పాలితత్రిదశసందోహాదినేంద్రప ऽ భావహరాప్త
విధృతిసంసేవిత ऽ విశ్వపోషకరమాధీశాసరోజేక్ష ऽ ణాశుభాంగ
విధృతగోత్రాధర ऽ వేదవేద్యవరచారిత్రప్రశస్తాహ ऽ శ్రీముకుంద
తే-గీ. సనకముఖమునిజనవిసర ऽ శరణనరప
తిరిపుసమదహరనృహరి ऽ పరమవినుత
నరసఖనిజనతతరణ ऽ నిరుపమభవ
ధరణిధరభరణవిమల ऽ తరణికులజ. 74

గర్భద్విపద.

వినతసంరక్షణ ఽ విశ్వసృడ్జనక ప్రనుతపద్మోద్భవ ఽ పాలితత్రిదశ
విధృత సందీపిత ఽ విశ్వపోషకరు విధృతగోత్రాధరు ఽ వేదవేద్యవరు

గర్భమత్తేభవిక్రీడిత వృత్తము.

నతసంరక్షణవిశ్వసృడ్జనకనా ఽ నావేషభాషాఘనా
నుతపద్మోద్భవపాలితత్రిదశసం ఽ దోహాదినేంద్రప్రభా
ధృతిసందీపితవిశ్వపోషకరమా ఽ ధీశాసరోజేక్షణా
ధృతగోత్రాధరవేదవేద్యవరచా ఽ రిత్రప్రశస్తాహరీ

తేటగీతిగర్భితాట వెలది.

సనకముఖసుజనవి ఽ సరశరణనరప
తిరిపుసమదహరన్నృ ఽ హరిపరమవి
నుతనరసఖనిజన ఽ తతరణనిరుపమ
భవధరణిధరభర ఽ ణవిమలతర.

తేటగీతిగర్భిత గురుద్వయయుక్త కందము.

క. సనకముఖ సుజనవిసరశ
రణనరపతిరిపుసమదహ ఽ రన్నృహరిపరమా
వినుతనరసఖ నిజనతత
రణనిరుపమభవధరణిధ ఽ రభరణవిమలా

ప్రతివాక్యాద్యక్షరనియమసీసము.

రామావతారణా ఽ రాజభిద్వారణా రాజత్కృపాసాంద్ర ఽ రామచంద్ర
రాజీవదళనేత్ర ఽ రక్షోలతాదాత్ర రసపూరమృదుభాష ఽ రమ్యవేష
రాకాశశాంకాస్య ఽ రహితమాయాలాస్య రామవిక్రమధుర్య ఽ రక్షితార్య
రాజితమణిహార ఽ రాధికాహ్వాచ్చోరరాసకేళీలోల ఽ రాజ్యపాల
తే-గీ. రసికనుతికేళికాపాత్ర ఽ రణవిచిత్ర
రవికులోద్భూతసౌజన్య ఽ రాజమాన్య
రాగమూలక్రియాధార ఽ రాగసార
రక్షితమహేంద్రశ్రీవీర ఽ రాఘవేంద్ర. 75

సీ. కనకకస్యపపుత్రుఁ గన్నకృపాదృష్టి కరినేలినట్టిసం కల్పపుష్టి
అక్రూరుపైఁగల్గు నతిదయాసారంబు విదురునేలినభూరి వితరణంబు
ద్రౌపతిఁ గాచువ స్త్రప్రదానవిధంబు అంబరీషునిఁ బ్రోచు నభిలషితము
నరునిపైనుంచిన పరమార్థ భావంబు ఆకుచేలుపయిబ హూకరంబు
తే-గీ. నాపయినిఁ గొంతరానిమ్ము నమ్మినాను
ఆపదలనుంటి నేడు నీ ప్రాపుగంటిఁ
బ్రోవుమో రామచంద్ర కా రుణ్యసాంద్ర
రక్షితమహేంద్ర శ్రీవీర రాఘవేంద్ర. 76

స్వప్నమున రెడ్డికి స్వామి ప్రత్యక్షమగుట.

వ. అనియిట్లు చ్చతుర్థ వంశవివర్ధనుండు తదేకనిష్టాగరిష్ఠుండై యిష్ట దేవ
తావతంసంబగు శ్రీ వీరరాఘవోత్తంసుని ప్రార్థించుటయు నప్పరమ
కృపాళుండగు రమాలోలుండు తద్భక్త వరుని దుమలెడలింపఁదలంపొం
దినాటి రేయి నాతని స్వప్నంబున ప్రత్యక్షుండై. 77
తే-గీ. పలికె సల్లాభ్యుతోదయా స్వాంతుఁడగుచు
వత్సతక్షణమీవీడు బాసి విపుల
దండనాయకపరిపాలి తస్థలంబు
చెచ్చెరకుటుంబయుతముగ జేరుమికను. 78
చ. అచటను రాఘవాకృతిన హర్మ్యఖకోటివిభాకరోజ్వల
ప్రచురవినూత్నరత్నయుత భర్మమయప్రతిమన్ సృజించి సీ
వుచితసమార్చనారతిని నుండుము భద్రముగూడు నంచుఁ దా
రుచిరవచోప్రచారణప రుండగుచున్ గృపనానతిచ్చినన్. 79
తే-గీ. అధికధృతిబూని వేగఁ దా నచటుఁ బాసి
సతిసుతహితాదిపరివార సహితుఁడగుచు
దండనాయకపాలితో ద్దండమైన
హనుమకొండను వసియించె నతిరయమున. 80
చ. ఘనతరనూత్నరత్ననవ కాంచనరాజితమైన రాఘవేం
ద్రునమరిపించినైష్టికప రుండగుచున్ ఘనశేసుకో త్తరం

బునభజియింపుచుండెనచి వృల్ బుధులాప్తులనూనభక్తిఁద
న్ననిశముఁగొల్వఁజెన్నదవె నప్పురిముప్పిరిగొన్న సంపదన్. 81

చ. పురములు జాగిరుల్ వనులు భూములుకంద్రికలగ్రహారముల్
వరగజరాజబృందములు వాజివముల్ రథముల్ భటావళుల్
ధరఁగలరాజసంపదలు దారముదాప్తిఁబరిగ్రహించితా
నరిదిగనుండెభూసురుల హర్నిశముఁ వినుతింపుచుండఁగన్. 82

వ. ఇట్లుండె. 83

క. విదితగిరికంధిసోమకు, ముదహితసంఖ్యగతశక ౧౧౮౭ స ముద్యత్సంప
త్ప్రదమగు తారణవర్షము. మొదలసుభిక్షతరకాలమునసుత్సుకుఁడై.

"దృష్టాంతం శ్లో. శ్రీమచ్ఛకాబ్దేబుషివార్ధియుద్ర
సఙ్ఖ్యాప్రవర్తేసతి తారణాబ్దే
అల్లాతభూపేనముకొండదేశే
దాంతాన్వయాకుండిన రాజధాని." 85

అల్లారెడ్డి కుండినదేశమునకు చేరుట.

సీ. వేదవేదాంగసంవేద్యులౌవివిధ విద్వాంసులొక్కదెశను పన్యసింప
హితమిత్రభేదసుహృల్లాభసంధివిగ్రహముఖచణమంత్రిగణములలర
నిజబిరుదాంకమానితగద్యపద్యార్థకృతిపఠద్వంది సంతతులుగొల్వ
ఘోరప్రతాపనిర్ధారణాధుర్యనాశిరనాధులుతనుఁజేరినిల్వ

తే-గీ. కుండినపురీసురేశదిక్షోణియందు
కొండపల్లికిదాపునఁగొమరుమిగులు
నట్టిదగుకవులూరనుపట్టణమున
సౌధములుగట్టివసియించెసౌఖ్యముగను. 86

క. కవులూరిలోననాతని, నవవిభవాస్పదగృహంబునకొకదినముమా
గ్గవశంబునవేమనయను, త్రివర్ణజుడువిశ్రమింపదిగియెతనిగన్. 87

మ. అతడభ్యాగతసేవనాభిరతుఁడై యత్యంతమాధుర్యవా
గ్వితతిన్ వేమననాదరించికుశలోక్తిన్ జెప్పనాలించిన
మృతితోభోజ్యపదార్థవారమిడికొమ్మా వెళ్ళవేభోజనా
దృతిఁగైకొమ్మయటన్న నౌననుచునెంతేమోదచిత్తంబునన్. 88

సీ. వేమనాభిఖ్యుండు వింధ్యాద్రి వసియించి వరఋషికృపఁగొన్న స్పర్శవేది
నొక పాత్రనిడి వస్త్ర శకలి నిబంధించి చిలకొయ్యనిడి కల్య ములనొనర్ప
జనుటయు విధివశం బునఁ దద్రసంబయశ్శకలంబునంటె హాటకముగాఁగ
గనిమాతృపితృవైర కారణహేమమాయనమ యను వాక్యార్థ నముద్రిడ
తే-గీ. తద్రసంబు స్రవించు చందంబు దెలసి [గుచు
కాంచనము గూర్చునా కాంతు గడలుకొనగ.
కర్బురమొనర్చు శక్తిని గలిగినట్టి
స్పర్శవేది హరించె నప్పాదజుండు. 89
ఆ-వె. తనదు గీమునకు హుతాశనమంటెంచి
స్పర్శవేది యింట భంగమయ్యె
ననుచు వైశ్యుఁ డెంచి యరుదెంచు నని కాంచి
యుండ వేమనాహ్వయుండు వచ్చి. 90
మ. విధినిందూరుచు ఖేదమొందుచు కటా వింధ్యాచలంబేగి త
త్కుధరంబందు మునీంద్రులం గొలిచి యస్తోకస్థితిన్ వారిది
వ్యదయన్ గాంచిన స్పర్శవేది విడిపోవం జాలు టెట్లొప్పునె
వ్విధినోర్వంగల నిట్టిదుఃఖమనుచున్ వేమాఖ్యుడగ్నింబడెన్. 91
వ. ఇట్లా వైశ్యుండు వహ్ని దగ్ధుండగుటయు హుతాశనోపశమన క్రియా
రతినరుదెంచి నపౌరులెల్లరు నతని మృతికి నత్యాశ్చర్యమునొఁది కీలి
కీలాభీలంబులగు శాలాంతరాళంబుల కీలాలంబులచే నార్చిరంత. 92
సీ. ఆరాత్రి రెడ్డి స్వప్నావస్థయందు నా వైశ్యుఁడు వేమన వచ్చి నిలచి
దుష్టాత్మ నీ సేయు దుష్కృతంబరసితి వింధ్యాద్రి వసియించి వివిధశ్రమల
బడి మౌనికరుణచేఁ బడసిన స్పర్శవేదిని హరించితివి మత్తీవ్రశాప
వశమున రసము భూపతితమైని వంశహరణ మానటుల సేయఁగలనైన
తే-గీ. నీయెడఁ గృపారసముగ ల్గె నీవు నాకు
మున్నొసంగిన యాతిథ్యమునకుఁ బదులు
మేలుగా వరమిడెద నమేయముగను
వినుమనుచు దెల్పె రెడ్డికి వేమవిభుఁడు. 93

ఉ. తావకవంశసంభవులు దారమతుల్ నృపులార్గురాశతా
బ్దావధిభూమి నేలుదురు వారొనరించెడు ధర్మకర్మముల్
సేవలునాకునర్పణము సేయుచునస్మదభిఖ్యవారికెం
తేవెలయించినన్గొలువ నిష్టము చేకుఱు నంచుఁబల్కినన్. 94

క. వినిభవదాజ్ఞ నొనర్చెద, ననివేమనఁ గూర్చిమ్రొక్కినతడంతర్ధిం
గనినంత నెమేల్కనికో, భవలీల వసించెఁబురిని పారవిభవుఁడై. 95

వ. అనంతరంబయితని వంశజుండగు. 96

పోలయవేమారెడ్డివృత్తాంతము.

సీ. పోలయవేమభూపాలుండు ప్రబలుఁడై మహిదిసదినవర్ధమానుడగుచు
స్వర్ణవేదిరససంప్రాప్తగాంగేయ విస్తారుఁడై విపులప్రశస్తిగాంచి,
అతిస్థాలితపురాగ్ర్యము లైనధరణికోటనుగొండపలిదుర్గములనుసృజించి
హయరథగజభటోచ్చయముల చేనొప్పు చతురంగబలసమార్జనము

తే-గీ. కుండినమహాత్వమెఱిగితి క్షోణినెల్ల సర్చి.
తేకువజయించియటఁగాక తీయకులుల
కొండవీటిపురంబునఁ గూల్చియచట
భద్రసింహాసనస్థుఁడై పరిఢవిల్లె. 97

వ. అంతనమ్మహీకాంతుండు నితాంతసంతోషితస్వాంతుండై కుండిననగర
పాలనానుకూల శేముషీవిశేషంబునఁ దత్కుధరంబునంగల దుర్గంబు
లెల్లం బరీక్షించి మర్త్యంబులం జలసి సురసరసేన్యంబనిలెలంచి తనభృ
త్యనృపాలుర నిరుప్రరిధరణికోట కొండపలిపురంబులుపాలింప నియమిం
చికొండవీటి ప్రభుత్వసంపద్యుక్తుండై యందు రాజధానిగా నివసించి
యచ్చట. 98

మ. మునుద్వాపరమునందుభీష్మముఖులౌ భూపాలకులుల్ సేయుచో
ప్పునఁదానుగిరిశృంగవాసులగునా మూర్తిత్రయిన్ సారభ
క్తినిబూజింపుచునాలయంబులను రక్తింగట్టెనిలోత్సవా
ద్యనురక్తుండగుచున్ జెలంగెహరిసేవాయత్తచిత్తంబునన్. 99

ఉ. కుండిననాగభీష్మనృప । కుంజరపాలితమైఖిలంబునై
యుండినవీడుఁజూచికన । కోజ్వలసౌధరవీందువీధుల
మండితసాలశాఖికల । మానితమైనపురీ సృజించితాఁ
గుండినమంచునామమిడి । కుచ్ఛితఖండనుఁడొచు నేలుచున్. 100

తే-గీ. దానికిధనేశుదిశబహు । తరవిశాల
దేశముండుటఁగాంచిధా । త్రీశుడెలమి
ధరణికోటనుగలమట్టి । త్రవ్వికట్టె
పుట్టకోటయనగనొక్క । పట్టణంబు. 101

సీ. గిరిమీదపూర్వభూవరులునిర్మించినయిమ్ములౌ శిల్లాల । నెల్లజూచి
తనదుబలంబులందునవిల్పగానెంచివిపులప్రమనూత్న । విధముగాను
నిర్మించిబహురాజ । నిలయంబులమరించిపౌంజులనెల్లన । ప్పట్లనుంచి
వేమనస్మృతిలబ్ధ । విపులదోషంబెల్ల పరిహారమగుటకై । భక్తి వెలయ

తే-గీ. భర్గనిర్మితకలశవి । భ్రాజితముగ
సలలితముగనష్టోత్తర । శతపరిమిత
హరప్రతిష్టలగావించె । నవ్యయముగ
ప్రమథగణముఖ్య సేవిత । ప్రథితములుగ. 102

తే-గీ. చదలువాఁడపురంబున । బాదలునట్టి
రాఘవునకుఁ బతిగను । శ్రీ రామచంద్రు
మందిరముగట్టరామసిం । హాసనమును
మోహనగిశౌరినిల్పెనం । ప్రీతితోడ. 103

ఆ-వె. శ్రీయహోబలాద్రి । శ్రీశైలముఖమహా
క్షేత్రములకుబోవు । యాత్రికులకు
సౌఖ్యపథములలర । సోపానవీధుల
గట్టనప్పిభుండు । కడుముదమున. 104

సీ. ప్రతిగుహాస్థులునునో । బ్రాహ్మణపూజలునలి పెడువనతలు । నచ్చెరించి
ఇంటింటబావులిం । పెసగంగఁద్రవ్వించికి విహరించినీతి । గణకఁజెంచి

ధీరులకఖిలాస్త్ర హారముల్ నిర్మించి సకలశాత్రవులెల్ల సమయమించి
తొడరియొన్బదినాల్గు దుర్గముల్ గావించి కప్పముల్ గొంచు దుర్గతులడం
తే-గీ. రామరాజ్యానుమతుడౌచు రమణగాంచి [చి
పరగఁ బండ్రెండునూర్ల నల్బదియు రెండు 1242
మొదలు యేబదిమూడుగ భూభరంబు 1253
గొనియె ద్వాదశవర్షముల్ కోర్కెలూరె. 105

అనపోత వేమారెడ్డి కథ.

సీ. విద్యావిశేషదర్వీకరప్రావీణ్యమహితవిద్వత్సభామండలుండు
పటుభుజాబలసముద్భటనృపానేకశుంభద్గర్వభంజనభంషనుండు
జగదభివ్యాప్తవిశ్రాణననిజభృత్యకాండదారిద్ర్యవిఖండనుండు
నిరతసుహృజ్జనానీకసంరక్షణాఖండదుష్టజనౌఘదండనుండు.
తే-గీ. అనగబొగడికఁగనుచతుర్ధాన్వవాయ
కీర్తివిభ్రాజితుఁడు చక్రవర్తివిభుడు
విమతశిక్షానుదక్షుండు విపులయశుడు
పృధులుడనపోతవేమన రెడ్డిఘనుడు. 106
క. దినదినవివర్ధనుండై, యెనుబదినలు(84)దుర్గములకు నేలికయై భూ
జనులెన లేనిముదంబున, దనరగఁ బాలింపుచుండెఁ దన్మండలముల్.
వ. అట్టి యెడనప్పట్టణసామీప్యంబునంగల పర్వతంబున శ్రీబొల్లుమూరు
వేంకటేశ్వరని వసితింబగు శిఖరశ్రేష్ఠంబునందు. 108

సిద్ధునికథ.

మ. ఒకసిద్ధుండు నితాంతనైష్ఠికతపోద్యోగారతుండౌచు దే
వకృతంబై నరమేశుమందిరసమీపంబందుఁ గూర్చుండగో
పకులుంబొక్కఁడు మేషపోషణకృత వ్యాపారుఁడై వేంకటే
శుకుభృత్యస్థానికిఁ బోయి సిద్ధుఁ గనిదా స్యుండౌటయున్ సిద్ధుఁడున్. 109
సీ. కరుణించి గోపకుఁ గతిపయకుశలోక్తులను నూరడించి భక్తునిగ నెంచి
నీకుపకారంబు నెరపెదనా యందుభక్తి చేసేవానురక్తుడవయి

దినదినమ్మికనుమ త్రిస్వకరార్హములగు క్షీరముల్ గొనినన్నుఁ జేరవచ్చి
నిత్యంబో సంగము నీకొకలాభంబు జేకూరునటులనే జేయువాఁడ

తే-గీ. ననుచు బోధింప గోపకుఁ డౌనటంచు
నట్లసేయన కానెంచి నదిమొదలుగ
దుగ్ధమర్పింపుచుండ చతుర్ధజాతు
నిట్లనుచు నొక్కనాఁడు ప్రశ్నించె జటుడు. 110

సిద్ధుడు గోపకునితో దివ్యవృక్షవిషయమై ప్రస్తాపించుట.

ఉ. గోపక కాననెందుననుఁ గొట్టగ వేఁజిగురొత్తు వృక్షమున్
జూపితివేని నీకధిక శోభనముల్ ఘటియింతుఁగాన నీ
వేపగిదిన్ వనంబు చరియించి కనుంగొని దానిపై ఘృణల్
దోపకయుండ కంటకతతుల్ పడఁద్రోచి వచింపుమా గతిన్. 111

వ. నావుండు నతికుతుకభరితమతియై సంతతంబును మునిసేవాభిరతుండై
వనంబుఁ గ్రుమ్మరునెడ నమ్ముని బోధితప్రకారంబుగా ప్రతివృక్షంబునుం
బరీక్షింపుచుండుటయుఁ గతిపయదినంబులకు నొక భూరుహంబును
గనుంగొని కంటకప్రకరసమావృతంజేసి తద్వృత్తాంతంబు జటికిం జె
ప్పిననతండును సంతసించి. 112

తే-గీ. శుభకరముహూర్తమొక్కటి చూచి జటుడు
గోపకసమేతుఁడగుచు నాక్షోణిజంబు
కడకరిగి వేదమయమంత్రకముగ షోడ
శోపచారప్రకరపూజ లొప్పఁజేసి. 113

ఆ-వె. శిఖఁదగిల్చి మాని చేబూని గోపకు
హుతసమగ్రవీతిహోత్రునకుఁ బ్ర
దక్షిణంబొనర్పఁ దరలించి వేమరు
పాటనుండఁ జూచి పదజనతడు. 114

సిద్ధుని గోపకు డగ్నిం ద్రోయుట.

శా. దుష్టజ్వాలలఁ గ్రాలు పావకుఁబడన్ ద్రోయంగ గొల్లండు దో
ర్దృష్టిన్ జూచి మదీయదుగ్ధముల నర్థిం ద్రావినన్ జంపె దో

భ్రష్టాచూడు మి దేవధింతు ననుచుఁ । బాహాబలం బొప్పఁగా
స్రష్టామల్గని విభ్రమింపఁగసిసి । యఁ ద్రోసె వహ్నిఁ మునిఁ.115

వ. అంత నమ్ముని సత్తముండు నిరతోపవాస కృశీభూతుం డగుట నా చతుర్భుజా టోపంబున కోపంజ్వాలక వన్నిఁ౦బడిపరితప్తుండై ద్రెళ్లుట యు నాగోపాలుండు నిజప్రాణ రక్షణ ప్రజ్ఞావిశేషంబున కుబ్బుచుఁ గొబ్బున తన గీమునకరిగి మరుదినంబున. 116

క. తనకపకృత్యమ్మును సే, యనకాదలచినమునివ్మృతు । డయ్యెనో లేదో,
కనివత్తు ననికుఠారము, గొనిచనెత ౘద్రుమస్థ । కుధరంబునకుఁ.117

వ. అచట త ౘద్రుమ ప్రభావంబున. 118

సీ. ఘనతరభుజయుగ । గ్రసనాగతినిమించు
పటుతరంబగుజటా । పటలమమర,
పూర్ణిమ చంద్రికా । స్ఫురణజెన్నలరారు
మోయూర్ధ్వపుండ్రంపు । బూతినలర,
వక్షఃకవాటసం । వ్యాకీర్ణములగుచు
రుద్రాక్షసరులు శి । రోధిఁ వ్రేల,
భూత పిశాచ సం । జాతముల్ దొలగించు
దండకమండలో । ద్ధతితలిర్ప.

తే-గీ. విలసితంబగు సౌవర్ణ । విగ్రహంబు
వైరి జడదారి రూపంబు । వరలి జీవ
రహితమ్మై నిల్వఁగాంచి తీ । వ్రప్రతాప
వివశుఁడై యోర మరల జీ । వించితనుచు. 119

గొల్లడు సువర్ణ విగ్రహమును చూచుట.

మ. ఖరతేజోగ్ర కుఠారఘాతఁ గరముఁ । ఖండింపవే వ్రయ్యలై
ధరఁగూలం గరమెప్పటట్లు త్రుటిమా । త్రఁ బుట్టి శోభిల్లఁదా
గరమాశ్చర్యము బొంది హేమహరణా । కాంక్షఁ మదిఁ మేలటం
చురహస్యంబుగఁ గేలుఁగేలఁగొని వై । శ్యుంజేరె మూల్యార్థతఁ.120

తే-గీ. వైశ్యుఁడదిగని గోపక వశ్యుఁడగుచు
గోపకకులీన నీకోరు కోర్కెలెల్ల
తెలియఁజేయుము నేనిప్డు తీర్చువాఁడ
కొరతలేదెందు ననునమ్ము కొంటివేని. 121

వ. నావుండును సంతుష్టాంతరంగుండై వైశ్యుంజేరి వీడ్య పదార్థంబులం
గోరి యువియెల్ల నిత్యంబును హేమమునకుఁ గొనుచుండుటయు త
ద్వైశ్యుండు కాంచనార్జనా విశేషంబున నితాంతద్రవ్యవంతుండై
ప్రభు సమానంబునం బరిఢవిల్లుచుండ నీవైశ్యునిభాగ్యాతిశయంబు
నంతింతఁ జారోక్తిని నంజనాయకుం డెఱింగినిజాస్థానంబునకు నతి
విని రావించి దండించు వచనంబుల నీకీభాగ్యంబు స్వల్పకాలంబున
లభించుటకేమి కతంబని యడుగుటయు నతండుపరికంపితాంగుండై
తానెఱుంగు తెఱంగెల్ల విన్నవించిన. 122

ప్రభువు సువర్ణ విగ్రహమును గూర్చి విచారించుట.

క. వినిబంగరు బొమ్మంగన, మనమున నూహించి మిగులమాత్సరమున గొ
ల్లనిబిల్వఁ బంపితద్విధ,మునుఁ దెలసికొనంగ నిట్లుభూవిభు డడిగెన్.

శా. ఏరాగోపక కులాధమా యెటులనీ హేమంబునార్జించియీ
బేరుల్ జేర్చుచు నుంటివేర్చినసల్ భేదించుచున్ దుర్గతిన్
జోరత్వంబునఁ గొంటివ్రాపలుకు మీ చొప్పెల్ల నిక్కంబుగాఁ
గారాసిల్ వధియింతు నక్కజపుఁ బల్కుల్ పల్కకున్నం జుమీ.

చ. అనుటయుఁ గోపకుండు వినయంబెనయన్ బరికంపితాంగుడై
మనవి యొనర్చెనంజలిని మస్తకమందునఁ జేర్చినీన ర
క్షణవిధు మయ్య నాయెడ పరా చాక మొకింతయు లేదటంచుఁదా
కనినది విన్నదిన్ గిరినిఁ గల్గిన దెల్లనుఁ దెల్లమై తగన్. 125

చ. వినివిని నెమ్మదిన్ మిగుల విస్మయ మొంది కృశాంతరంగుఁడై
తనకడకుం గుమారుని విధంబున గోపకుఁ జేరదీసి నీ
మనమునఁ గల్గు కోర్కెలను మన్నెదఁ దప్పితిమంబుఁ జూడగన్
జనెదను నమ్ముగమ్మనుచుఁ జయ్యనగోపకు నుత్సహింపుచున్. 126

సీ. తనమంత్రులకునిర్విరోధంబు వక్కాణించి
తత్కాలమెనుముహూర్తముగ నెంచి,
హేమవిగ్రహాదర్శనేచ్ఛనెదవహించి
మంత్రిప్రతతి గొల్వమరగమించి,
గోపకయుక్తుడై కొండపైకేతెంచి
యపరంజిమయ విగ్రహంబుగాంచి,
దైవజ్ఞగాగ యాదవునిసంభావించి
మహాధరాతిశయము మదిదలంచి

ఆ. వె. విభ్రమాతిరేక వివశుడై ధర్మంబు
తనకులభ్యమగు విధంబులెల్ల
నరసి దెలసితత్ప్రకరణంబు లొనరించి
గీము జేర్చి పూజ క్రియలనుంచి. 127

తే. గీ. ధర్మమార్గస్థుడై లోక తతులనుతులు
బొదల బండ్రెండు నూర్లయేబదియునాల్గు 1254
మొదలు యెన్బది మూడుగ భూభరంబు 1283
నతడు వహియించె ముప్పది హాయనములు 128

వ. తదనంతరంబ. 129

అనవేమారెడ్డికథ.

సీ. త్రిభువనమోహనదివ్యసుందరమూర్తి ప్రబలరాష్ట్రాదికభయనివర్తి
నిజవితరణగుణవిజితదారిద్ర్యార్తి సదమలకరుణారసప్రపూర్తి,
లాలిత ధర్మప్రహేళితసమవర్తి నతహితాదికసమానప్రవర్తి,
విద్వత్కవిస్తుతివిపులవచోవర్తి దశదిశవ్యాప్తవిస్తారకీర్తి.

తే. గీ. అష్టదిగాంతతీరసమావృతోర్వ
రాభిదానప్రశస్తంబు జాకరస్థ
ధీరహృత్కమల త్రిమూర్తిస్వరూప
నతతనుతమూర్తి యనవేమచక్రవర్తి. 130

క. అతఁడు నిజాటోపంబున, కుతలభరం బెల్ల మోపియుఁ గోరిఘనుండై
పితృదత్త దుర్గములకుం, బతియైకుండినము వేడ్కఁ బాలింపునెడన్.

వ. తదాస్థానమునందు. 132

శా. కాశీఖండముఖప్రబంధరచనాకౌశల్యుఁడున్ మారమం
త్రీశాత్మప్రభవుండు గోవిదగణాధీశుండు మారాంగుడున్,
కాశీ సేతుపరీతభూ ప్రథితవిఖ్యాతుండుఁ బూతుండునా
నాశాస్త్రార్థవిశారదుండు కవి శ్రీనాథుండు విద్వాంసుడున్. 133

మ. తన తేజంబు వహింపభాస్కరుఁడు సత్రస్యందనుండయ్యె ధా
రుణికిం భాంధవుఁడయ్యె బ్రహ్మహరిరుద్రుండయ్యె నెప్పట్లఁదా
నెనరామిర్జరి మాద్రికింజని తపంబేరోజుఁ గావించునో
యనగిర్ రాయని భాస్కరుండలరె ముఖ్యామాత్యుఁడై యచ్చటన్.

క. శ్రీనాథుఁడెల్లజగముల, బూనిక రక్షింపుచుండ భూమిస్థలినీ
భూనాయకు కడకవియై, శ్రీనాథుడు గొల్చుచుంట చిత్రముగాదే.

క. భాస్కరు డధికారంబున, శుష్కింపగఁజేసి ప్రజల సొంపణచుచునుయీ
భాస్కరుఁడధికారంబున, శుష్కిభూతులగు ప్రజల సొంపలరించున్.

వ. ఇట్లు విద్వన్మంత్రి పుంగవులు పరివేష్టించియుండ నిజ భుజాటోపంబున
దేశంబులదయించుచు కవీంద్రదత్త కృతి ప్రకరప్రభావంబున బడయు
మహదైశ్వర్యంబున నోలలాడుచు స్వస్థాన విద్వన్ముఖుల నన్యసంస్థా
నంబులకుఁ బంచుచు వారిలు తత్తత్సభానగరుల నోడింపుటకు మిగుల
నుత్సాహింపుచుండె. 137

## అనవేమారెడ్డి బిరుదు.

"వ. స్వస్తిశ్రీ సకలగుణాలంకార చతురచూడాకార విశ్వంభరవహన దక్ష దక్షిణ
భుజోద్దండ జగమేశ్వరగండ అయోమండలీకార గండరా చేకులదండ అర్థిప్రత్యర్థి
హేమాద్రిదాన నిరత ప్రజాపరిపాలన ధురీణాసని ధరణవరాహ నారాయణ వీరనారా
యణ భుజాబలభీమ కోదండరామ అపరిమిత భూదాన పరశురామ అనేక నగరవ
సుంధర ప్రతిపాలిత బహువిధరామ సంగతి రక్షపాలక జగదగోపాలక ఘూర్జరితి

దివిభోళ ఘనభుజ మేజనామ కరవాల రాచూరుదుర్గవిచోళ అనవరత పురోహిత సోమపాన శ్రీ పర్వత అహోబళ వేంకటాచల నిర్మిత సోపాన దిక్కాంతా మనోహార కీర్తి కుసుమా మోదకుండి ప్రభానవ్యా జగాతమీ జలక్రీడా వినోద విరోధ నృపదానవ నారసింహ పాండ్యరాజ జగసింహ ప్రజ్ఞా చతుర్విధోపాయ వేళాధిరాయ నిత్యపరిపాలిత సత్య పర్లవాదిత్య రిపునరపతిగో ధూమఘట్టన ఘరట్ట అప్పయ గోపయదిశా పట్టసంగ్రామ సముద్దండ చండ భుజాసి విఖండిత శత్రుకీలాలపవమాన పిశాచగణస్తూయ మానయశోమండన అళసీయ వరదశిరఃఖండన దుర్మదవైరి భయంకర బసవశంకర అమరేశ్వర చరణ సరసీరుహాదంత భావదండనగార బ్రహ్మాగుండ కృష్ణవేణి గోదావరీ మహానదీ తటద్వయ న్మధ్య దేశదత్తానేకా గ్రహార అగణ్య పుణ్యక్షేత్ర సత్రదత్త బహువిధ హారవరపుర హారణ మృత్యుంజయ సంగ్రామ ధనంజయ ఉత్తుంగ చతురంగ బలరిపు సేనాసాధక త్రిపురాంతక దేవదివ్యపాద పద్మారాధక ప్రేరిత మల్లనాథపయః పారావార పరిపూర్ణ సుధాకరుండైన శ్రీ మదన వేమారెడ్డిగారు.” 138

క. ఈరీతిని బిరుదులుజెలు, వార మహీసురుల కగ్రహారంబులువి
స్తారముగ నిడుచుకృష్ణా, తీరంబున నతఁడు మిగుల ధీరత వెలయన్.

క. అమరేశ్వర ప్రతిష్టను, క్షమయందా చంద్రతారకముగాగనోస
ర్చిమహోత్సవాది విభవము,లమరగబహువసతులెల్ల నతడిడెభక్తిన్

తే-గీ. ఇత్తెఱంగున నమ్మాన వృత్తిమండు
సకలధర్మ స్వరూపుడై సదయుడగుచుఁ
బరగి పండ్రెండునూర్లయె న్బదియునాల్గు 1284
మొదలు తొంబదియైదుగ బుడమి నేలె. 1295 141

కామగిరి వేమారెడ్డి వృత్తాంతము.

క. కామగిరి వేమభూవిభు, డామహితస్థానికధిపుడై యొనబదినాల్
సీమల ప్రభుత్వ సంపద, చే మహిపైఁ జెలగె వివిధ చేష్టారతుడై.

సీ. తనపూర్వు లొనరించు పనులెల్ల వీక్షించి
మరిద్రవ్యవ్యయమని మదిదలంచి
మంత్రిప్రముఖులన మంత్రముల్ వర్జించి

